Islam ka Nazria Siyasi
(Telugu)

# ఇస్లాం వెలుగులో సామాజిక న్యాయం

మూలం:

**మౌలానా సయ్యిద్ అబుల్ ఆలా మౌదూది (రహ్మాలై)**

అనువాదం:

**ఇఖ్బాల్ అహ్మద్**

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడయిన అల్లాహ్ పేరుతో

# ఇస్లాం వెలుగులో సామాజిక న్యాయం

*(ఈ వ్యాసం 1381 హిజ్రీ (1962)లో హజ్ సందర్భంగా మక్కా ముఅజ్జమాలో ఏర్పాటు చేయబడిన ప్రపంచ ఇస్లామీ కాన్ఫరెన్స్‌లో చదువబడింది)*

## అధర్మం, సత్యం ముసుగులో...

అల్లాహ్ మానవుణ్ణి ఉత్తమ జాతకంతో పుట్టించాడు. అతడు కల్లోలం, సంక్షోభం, ఉపద్రవం వైపు మొగ్గుచూపడం బహు అరుదు. మానవుణ్ణి ఇలా సృష్టించడం అల్లాహ్ అపూర్వ మహాత్మ్యాలలో ఒకటి. శ్రేయం, సత్కార్యాలనే పరదాచాటున మనిషిని ఉపద్రవాలు, కల్లోలాల్లో చిక్కుకునేటట్లు వలపన్నడం షైతాన్ చేసే ప్రయత్నాలు. నీవు దైవానికి అవిధేయత చూపేటట్లు చేస్తాను, దాని కారణంగా నీవు స్వర్గంనుండి బహిష్కరించబడతావు అని చెప్పి షైతాన్ ఆదం (అలై)ను మోసగించకుండా ఈ క్రింది తియ్యని మాటల ద్వారా మోసగించడం జరిగింది.

> **'శాశ్వత జీవితాన్నీ, నశింపు లేని రాజ్యాధికారాన్నీ ఇచ్చే చెట్టును చూపించనా?'** **(తాహా సూరా : 120)**

నేటికీ మానవునిపట్ల షైతాన్ అవలంబించే విధానం కూడా అదే. అతడు రకరకాల తప్పులలో, మూర్ఖపు చర్యలలో మానవుడ్ని ఇరికించాడు. ఏదో ఒక మోసపూరిత నినాదం లేదా తప్పుడు ముసుగును అడ్డుగా పెట్టుకుని చేయిస్తున్నవే.

## మొదటి మోసం- పెట్టుబడిదారీ విధానం, మత ప్రసక్తిలేని లౌకిక ప్రజాస్వామ్యం

ఈ మోసాలలో ఓ పెద్ద మోసం, ప్రస్తుత కాలంలో సామాజిక న్యాయం (Social Justice)పేరుతో మానవాళిని గురిచెయ్యడం మొదటిది. షైతాను మానవజాతిని కొంతకాలం వరకూ, ప్రపంచాన్ని వ్యక్తి స్వేచ్ఛ (Individual Liberty), విశాల దృక్పథం లేక ఉదారవాదం (Liberalism) పేరిట మోసగిస్తూ వచ్చాడు. వీటి ఆధారంగా వాడు పద్దెనిమిదవ శతాబ్దంలో పెట్టుబడిదారీ విధానం మరియు మత ప్రసక్తిలేని లౌకిక విధానం పేరుతో ఒక వ్యవస్థను నెలకొల్పాడు. ఒకనాడు ఈ వ్యవస్థ ఎంత ఉధృతంగా ఉండేదంటే ప్రపంచంలో అభివృద్ధి సాధనకు అదే ఆఖరి మెట్టుగా భావించబడేది. తనను తాను అభివృద్ధి కాముకునిగా పిలిపిం చుకోదలచిన ప్రతి వ్యక్తీ స్వేచ్ఛ, ఉదారవాదాల గురించి ననదించక తప్పలేదు. మానవ జీవితానికి ఏదయినా వ్యవస్థ ఉందీ అంటే కేవలం అది పాశ్చాత్య దేశాలలో చలామణిలోవున్న ఈ పెట్టుబడిదారీ వ్యవస్థ మాత్రమే, మత ప్రసక్తిలేని ప్రజాస్వామ్యమేనని ప్రజలు భావించేవారు. కాని చూస్తుండగానే ఈ షైతానీ వ్యవస్థ ప్రపంచం మొత్తాన్ని హింసా దౌర్జన్యాలతో నింపే సమయం ఆసన్నమైందని మనం గ్రహించగలం.

ఆ తర్వాత శాపగ్రస్తుడైన షైతాన్‌కు ఇంకొంతకాలం వరకు మానవాళిని మోసగించే అవసరం ఏర్పడలేదు.

## రెండవ మోసం- సామాజిక న్యాయం మరియు కమ్యూనిజం

తర్వాత అనతికాలంలోనే ఆ షైతానే సామాజిక న్యాయం మరియు కమ్యూనిజం పేరుతో మరో మోసాన్ని బయటకు తీసుకువచ్చాడు. ప్రస్తుతం

ఈ తప్పుడు ముసుగులో వాడు మరొక వ్యవస్థను ఏర్పాటు చేయిస్తున్నాడు. అప్పటి వరకూ ఈ వ్యవస్థ ద్వారా ప్రపంచంలోని అసంఖ్యాక దేశాలను ఘోర దౌర్జన్యాలతో నిండివుంది. అహింసా దౌర్జన్యాల మచ్చు మానవ చరిత్ర లోనే అగుపడదు. కాని ఈ మోసం ఎంత ఉధృతంగా కొనసాగిందంటే ఎన్నో దేశాలు దీన్ని అభివృద్ధికి ఆఖరిమెట్టుగా భావించి స్వీకరించడానికి సిద్ధపడ్డాయి. ఈ మోసానికి సంబంధించిన బండారం ఇంకా బయట పడలేదు.

## విద్యావంతులయిన ముస్లింలు భావదాస్యంలో మితిమీరిపోవడం

ముస్లిముల ధార్మిక పరిస్థితి ప్రకారం, వారి వద్ద దైవగ్రంథం. దైవ ప్రవక్త సంప్రదాయం (సున్నత్)లో ఒక శాశ్వతమయిన హితబోధ వుంది. అది వారిని షైతానీ ప్రేరణల నుండి హెచ్చరించ డానికి జీవితంలోని అన్ని వ్యవహారాలలో సన్మార్గ వెలుగును చూపడానికి సరిపోతుంది. కాని ఈ భావదాస్యానికి ఆహుతి అయినవారు తమ ధర్మానికి దూరమవుతూ పాశ్చాత్యుల నాగరికత, ఆలోచనా శక్తులకు ఘోరంగా దాసోహమయ్యారు. అందుచేత ప్రపంచంలోని ఉన్నత జాతుల శిబిరాల నుండి వెలువడే ప్రతి నినాదమూ దాని ప్రతిధ్వనులు వీరిలో కూడా వినిపించనారంభించాయి. ఫ్రాన్సు విప్లవం నుండి పుట్టుకొచ్చిన భావాలు జోరు పుంజుకున్న కాలంలో ముస్లిం దేశాలలలో ఈ భావాలనే ప్రతి విద్యావంతుడు, ఈ భావాలనే సమయం సందర్భం అనేది చూడకుండా వాటినే గొప్పవిగా ప్రకటించడాన్ని తన విధిగా భావించాడు. వాటి మూసలోనే తనను తాను మలచుకోవాలని, అలా చేయకపోతే తన పరువు పోతుందని, తాను తిరోగమన వాదిగా భావింపబడతాడని భావించేవాడు. ఈ కాలం గడుస్తున్నకొద్దీ మన ఆధునిక విద్యావంతుల దిశ కూడా మారసాగింది. క్రొత్త యుగం రాగానే సామూహిక

న్యాయం, కమ్యూనిజాల నినాదాలు చేసేవారు మన మధ్యలో పుట్టుకు రాసాగారు. అంతటితో ఆగితే అది ఓర్పు వహించవలసిన విషయమే. కాని తన దిశలోని ప్రతి మార్పుతోపాటు ఇస్లాం కూడా తన దిశను మార్చుకోవాలని కోరే ఒక వర్గం మనలో కూడా తలెత్తడం విడ్డూరం. అంటే ఇస్లాం లేకుండా ఈ అభాగ్యులు బ్రతకలేరు. అది వారి వెంట ఉండటం అవసరం అన్నమాట. అంటే దేన్నయితే అనుసరించి వీరు అభివృద్ధి చెందగోరుతున్నారో ఇస్లాం కూడా దాన్ని అనుసరించాలని, ఇస్లాం తిరోగమన ధర్మం అన్న అపవాదు నుండి తప్పించు కోవాలన్నది వీరి కోరిక. ఈ కారణం చేతనే వ్యక్తి స్వేచ్ఛ, ఉదారవాదం, పెట్టుబడిదారీతనం, మత ప్రసక్తిలేని ప్రజాస్వామ్యం (Secular Democracy)వగైరాల పాశ్చాత్య భావనల్ని ఇస్లాంతో ముడిపెట్టి రుజువు చెయ్యాలన్న ప్రయత్నమూ జరిగింది. కాబట్టే ఇస్లాంలోనూ కమ్యూనిస్టు భావనల సామాజిక న్యాయం ఉందని ఇప్పుడు రుజువు చేయడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి, ఈ దశకు చేరుకున్న మన విద్యావంతుల భావ దాస్యం, అజ్ఞానపు ఈ వెల్లువ అవమానపు ఆఖరి మెట్టుకు చేరుకున్నట్లే.

## సామాజిక న్యాయం వాస్తవికత

అందుచేత, సామాజిక న్యాయం అంటే ఏమిటి? దాన్ని అమలు చేసే సరైన విధానం ఏమిటి? అలాగే కమ్యూనిజాన్నే సామాజిక (సామూహిక) ఏర్పాటు చేసే ఏకైక మార్గంగా భావించి దాన్ని ఏర్పాటు చేయడానికి తొందరపడుతున్నవారు తమ తప్పును ఒప్పుకొని వెనక్కు మరలుతారేమో అన్నదే నా ఈ సంక్షిప్త వ్యాస ఉద్దేశం. ఎందుకంటే ఓ అజ్ఞాని కేవలం అజ్ఞానిగానే ఉంటాడు. అతడిని సంస్కరించే అవకాశాలు మాత్రం మిగిలి ఉంటాయి. కాని అతనే పాలకుడు అయిపోతే - మాఅలిమ్‌తులకుమ్

మిన్ ఇలాహీన్ గైరీ (నేను తప్ప మరో ప్రభువును ఎరుగను) అన్న అహంకారం, అతడ్ని నచ్చజెప్పేవాని మాటను అర్థం చేసుకునేందుకు వీలు కల్పించదు. కాని ప్రజాసామాన్యం దైవకృప అన్నివేళలా సవివరమయిన విధానంతో విషయాన్ని వివరించి, వారిని షైతాను మోసాల గురించి హెచ్చరించగల స్థితిలోనే ఉంటారు. ఈ ప్రజాస్వామ్యాన్నే మోసగించి, భ్రష్టమానవులు తమ యోగ్యతల్ని మెరుగుపెట్టుకుంటారు. అందుచేత నా ఈ వ్యాసం ఉద్దేశ్యం ప్రజలందరి ఎదుట వాస్తవాన్ని వివరించి చెప్పటమే.

## ఇస్లాంలోనే సామాజిక న్యాయం

ఈ సందర్భంగా నేను ముస్లిం సోదరులకు వివరించదలచుకున్న విషయం ఏమిటంటే- 'ఇస్లాంలో కూడా ఎవరైతే సామాజిక న్యాయం ఉంది,' అని చెప్పేవాళ్ళు బొత్తిగా తప్పుడు మాటే మాట్లాడుతున్నారు. నిజం ఏమిటంటే అసలు ఇస్లాం లోనే సామాజిక న్యాయం ఉంది. విశ్వసృష్టికర్త, విశ్వప్రభువు మానవుని హితబోధ కోసం అవతరింపచేసిన సత్యధర్మమే ఇస్లాం. మానవుల మధ్య న్యాయం నెలకొల్పడం, వారికోసం ఏది న్యాయమో, ఏది న్యాయం కాదో నిర్ణయించడం విశ్వసృష్టికర్త పని. ఇతరులెవ్వరికీ న్యాయం మరియు దౌర్జన్యాల ప్రమాణాలను ప్రతిపాదించే హక్కు లేదు. వాస్తవ న్యాయం నెలకొల్పే యోగ్యత ఇతరులెవ్వరిలోనూ లేదు. న్యాయాన్ని ఇది ప్రమాణం అని నిర్ణయించడానికి మనిషి ప్రభువు లేదా పాలకుడు కాడు. అతడికి ఉన్న హోదా తాను సృష్టిలో ఓ దైవసృష్టిత మైన ప్రాణే. అందుచేత న్యాయానికి ప్రమాణం అని సూచించే పని అతడిది కాదు. అది అతడిని సృజించిన యజమాని, అధికారిదే. మనిషి ఎంత ఉన్నతస్థాయిగల వాడయినా, ఒక్క మనిషేకాదు చాలామంది కలిసి వారు

ఎంతో ఉన్నత హోదా గలవారైన, వారంతా కలిసి తమ మేథను ఉపయో గించినప్పటికీ మానవుని పరిమిత జ్ఞానం, బుద్ధిలోపం, పరిమిత ఆలోచన, కోరికలు, అసూయలకు లోబడినవారే. వారి ఆలోచనలు ఎట్టి పరిస్థితుల లోనూ శరణ్యం కాజాలవు. అందుచేత మానవుడు తనకోసం, న్యాయంపై ఆధారపడిన ఓ వ్యవస్థను రూపొందించుకునే అవకాశమే లేదు. మానవ నిర్మిత వ్యవస్థ ఆరంభంలో చూడడానికి ఎంతటి న్యాయమైనదిగా కనబడి నప్పటికీ, త్వరలోనే ఆచరణలోకి వచ్చే అనుభవం ద్వారా ఇందులో న్యాయం అన్నదే లేదని రుజువు అయిపోతుంది. ఈ కారణంచేతనే ప్రతి మానవ వ్యవస్థ కొంతకాలం గడిచేసరికి నాణ్యత లేనిదిగా నిరూపించ బడుతుంది. మనిషి దానిపట్ల విసుగుచెంది మూర్ఖత్వంతో కూడిన మరో అనుభవం వైపునకు నడుస్తాడు. వాస్తవమైన న్యాయం ప్రత్యక్ష, పరోక్ష జ్ఞానం కలవాడు రూపొందించిన వ్యవస్థలోనే ఉండగలదు.

## న్యాయమే ఇస్లాం ఉద్దేశ్యం

ప్రారంభంలోనే అర్థం చేసుకోవలసిన రెండవ విషయం ఏమిటంటే, 'ఇస్లాంలో న్యాయం ఉంది' అని ఎవరైనా వాదిస్తున్నారో అతను మాట్లాడే మాట వాస్తవం కన్నా తక్కువస్థాయిది. నిజం చెప్పాలంటే న్యాయమే ఇస్లాం ముఖ్యోద్దేశ్యం. ఇస్లాం వచ్చిందే న్యాయాన్ని స్థాపించేందుకు.

అల్లాహ్ ఇలాసెలవిస్తున్నాడు: "మేము మా ప్రవక్తలను స్పష్టమయిన సూచనలతో, హితోపదేశాలతో పంపాం. వారితోపాటు గ్రంథాన్నీ, త్రాసునూ అవతరింపజేశాము. ప్రజలు న్యాయంపై స్థిరంగా నిలబడాలని. ఇనుమునూ పంపాము. అందులో మహత్తరమయిన శక్తి ఉంది. ప్రజలకు ప్రయోజ నాలూ ఉన్నాయి. ఇలా ఎందుకు చేయబడిందంటే, ఆయనను చూడ

కుండానే ఎవరు ఆయనకూ, ఆయన ప్రవక్తలకూ సహాయ పడతాడో అల్లాహ్‌కు తెలియాలని. నిశ్చయంగా అల్లాహ్ ఎంతో దృఢమయినవాడు, సర్వశక్తి మంతుడూను. (అల్ హదీద్:25)

ఈ రెండు విషయాలు (అంటే ఇస్లామ్‌లోనే సామాజిక న్యాయం ఉంది, ఇస్లామ్ ఉద్దేశమే సామాజిక న్యాయం) పట్ల అప్రమత్తతను వహించే ప్రతి ముస్లిమ్ అల్లాహ్‌ను ఆయన ప్రవక్తను విస్మరించి ఇతర మూలాలు వేటివైపుకు దృష్టిని సారించే పొరపాటు చేయలేం. ఏ క్షణంలోనైనా అతడికి న్యాయం అవసరం అన్న భావన కలుగుతుందో ఆ క్షణంలోనైనా న్యాయం అన్నది అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త (స) తప్ప మరెవ్వరి వద్దా లేదు, ఉండజాలదు అని అతడికి తెలిసిపోతుంది. దాన్ని స్థాపించేందుకు సమగ్రమైన, సంపూర్ణమైన ఇస్లాంను ఎలాంటి హెచ్చుతగ్గులూ లేకుండా స్థాపించడం తప్ప గత్యంతరం లేదు అని కూడా అతనికి తెలిసిపోతుంది. ఇస్లాం ఒక్కటే న్యాయం. దాన్ని స్థాపించబడటం, న్యాయాన్ని స్థాపించ బడటం రెండూ ఒక్కటే.

## సామాజిక న్యాయం

ఇప్పుడు మనం సామాజిక న్యాయం అంటే ఏమిటో, దానిని స్థాపించే సరయైన విధానం ఏమిటో చూడాలి.

## మానవ వ్యక్తిత్వ వికాసం

ప్రతి మానవ సమాజం వేలాది, లక్షలాది, కోట్లాది మంది వ్యక్తుల కలయికతో ఏర్పడుతుంది. ఈ సమ్మేళనంలోని ప్రతివ్యక్తీ ఆత్మను, బుద్ధిని, స్పృహను కలిగిఉండేవాడే. ప్రతి వ్యక్తికీ ఒక శాశ్వతమైన వ్యక్తిత్వం ఉంటుంది.వాటికి వికసించే అవకాశం కావాలి. ప్రతి మనిషికీ తనదంటూ

ఓ వ్యక్తిగత అభిరుచి ఉంటుంది. మనసుకోరే కొన్ని ఆశలూ, ఆకాంక్షలూ ఉంటాయి. తన శరీరం, తన ఆత్మకు కావలసిన కొన్ని అవసరాలూ ఉంటాయి. ఈ వ్యక్తుల స్థాయి, ఓ యంత్రం చలనంలేని భాగాల వంటిది కాదు. అసలు వస్తువే ఓ ప్రత్యేక యంత్రమై ఈ విడి భాగాలు ఆ యంత్రం కోసమే తయారై ఉండాలి. యంత్రమే లేకపోతే ఆ విడి భాగాలకు విలువేలేదు. దానికి భిన్నంగా మానవ సమాజం సజీవులు, జాగరూకులు అయిన మానవుల ఓ సముదాయం. ఈ వ్యక్తులు ఆ సమూహం కోసం కాదు, ఆ సముదాయం ఉన్నది ఆ వ్యక్తుల కోసమే. వ్యక్తులు సముదాయాన్ని ఏర్పాటు చేసుకునేది, పరస్పర సహాయసహకారాలతో తమ అవసరాలను పొందటానికి, ఆత్మ మరియు శరీరాల అవస రాలను, కోరికలను తీర్చుకునే అవకాశం లభించాలనే ఉద్దేశంతోనే.

## వ్యక్తిగత జవాబుదారీ

ఇంకా ఈ వ్యక్తులందరూ ఒక్కొక్కరుగా దైవం ఎదుట జవాబు దారులే. ప్రతి ఒక్కరికీ ఈ ప్రపంచం ఒక ప్రత్యేక పరీక్షా వ్యవధి. (ఇది ప్రతి వ్యక్తికీ వేరువేరుగా ఉంటుంది) గడిచిన తర్వాత మనిషి తన ప్రభువు సమక్షంలో నిలబడి తనకు ఈ ప్రపంచంలో ఇవ్వబడిన శక్తులు, యోగ్యతలను ఎలా ఉపయోగించాడు, తనకు ఇవ్వబడిన ఒనరులను ఉపయోగించి తన వ్యక్తిత్వాన్ని ఎలా తయారు చేసుకున్నాడోజవాబివ్వవలసి ఉంటుంది. దైవసమక్షంలో ఈ జవాబుదారీ సామాజికమైనదికాక వ్యక్తిగతమైంది. అక్కడ కుటుంబాలు, వర్గాలూ, జాతులకు చెందినవారు కలిసి నిలబడి జవాబివ్వరు. పైగా అన్ని రకాల బంధుత్వాల నుండి వేరుచేసి అల్లాహ్ ప్రతి మానవుడ్నీ విడివిడిగా తన న్యాయస్థానంలో

హాజరుపరుస్తాడు. ప్రతి ఒక్కరినీ నువ్వు ఏమిచేసి వచ్చావు? ఎలా తయారయి వచ్చావు? అని ప్రశ్నిస్తాడు.

## వ్యక్తిగత స్వేచ్ఛ

ఈ రెండు అంశాలు- అంటే ప్రపంచంలో మానవ వ్యక్తిత్వ వికాసం మరియు పరలోకంలో మానవుడి జవాబుదారీ- కోరేది ప్రపంచంలో వ్యక్తికి స్వేచ్ఛ లభించాలనే. ఏదైనా ఒక సమాజంలో వ్యక్తికి తన యిష్టానుసారం తన వ్యక్తిత్వ పరిపూర్తికి అవకాశాలు లభించకపోతే అతనిలో మానవత్వం కుంచించుకుపోతుంది. అతడు ఉక్కిరిబిక్కిరి అవుతాడు. అతడి శక్తులూ, యోగ్యతలూ అణగిపోతాయి. తనను తాను చుట్టుముట్టబడినట్లు, నిర్బంధానికి గురయినట్లు భావించి నిస్తబ్దత, నిస్తేజాలకు గురిఅవుతాడు. ఇక పరలోకంలో ఇలాంటి నిర్బంధానికి గురయిన వ్యక్తుల పాపాలు బాధ్యతలు, ఇలాంటి సామూహిక వ్యవస్థను రూపొందించి, నిర్వర్తింపజేయ డానికి బాధ్యులైనవారి వైపుకు మరలింపబడతాయి. వీరి నుండి కేవలం వారి వ్యక్తిగత కర్మల లెక్క తీసుకోబడటమే కాక, వారు ఓ దౌర్జన్యపూరిత వ్యవస్థను నెలకొల్పి, అనేకమంది ఇతర మానవులను వారి యిష్టానికి వ్యతిరేకంగా , తమ ఇష్టం వచ్చినట్లు నాసిరకం వ్యక్తిత్వంగల వారుగా తయారయ్యేలా వివశులుగా చేసినందుకు కూడా జవాబుదారులే. అటువంటప్పుడు పరలోకాన్ని విశ్వసించే ఏ వ్యక్తి అయినా ఈ భారాన్ని మోస్తూ దైవం ఎదుటకు వెళ్ళడం ఊహించనైనా ఊహించలేడు. అతడే గనక దైవానికి భయపడే వ్యక్తే అయినట్లయితే, అతడు తప్పనిసరిగా వ్యక్తులకు అత్యంత అధిక స్వేచ్ఛను ఇవ్వడానికే మొగ్గుచూపుతాడు. తద్వారా ప్రతి వ్యక్తీ ఎలా తయారయినా అది అతని వ్యక్తిగత బాధ్యత. తప్పుడు

వ్యక్తిత్వంతో తయారయినందుకు సామూహిక వ్యవస్థను నడిపేవానిపై పడకూడదు.

## సామూహిక సంస్థలు - వాటి అధికారం

ఇది వ్యక్తిగత సేచ్ఛకు సంబంధించిన వ్యవహారం. మరోవైపు కుటుంబాలు, తెగలు, జాతులు మరియు పూర్తి మానవత్వ రూపంలో క్రమపద్ధతిలో స్థాపించబడిన సమాజాన్ని చూడండి. దాని ప్రారంభం ఒక పురుషుడు, ఒక స్త్రీ మరియు వారి సంతానంతో ప్రారంభమవుతుంది. దాని ద్వారా కుటుంబం ఏర్పడుతుంది. ఈ కుటుంబాలతో వర్గాలు, వంశాలు, తెగలు తయారవుతాయి. వాటి ద్వారా ఒక జాతి ఉనికిలోకి వస్తుంది. జాతి తన సామూహిక నిర్ణయాల విధింపు కోసం ఒక రాజ్య వ్యవస్థను నెలకొల్పుతుంది. ఈ వివిధ రూపాలలో గల ఈ సామూహిక సంస్థల వాస్తవమైన లక్ష్యం ఏమిటంటే, వారి భద్రతకు, వారి సహాయంతోనే వ్యక్తికి తన వ్యక్తిత్వ నిర్మాణానికి అవకాశం లభించాలి. అతడు ఒంటరిగా తన శక్తియుక్తులతో అవకాశాలను పొందలేడు. వారి ప్రతి సంస్థకూ వ్యక్తులపైనా, పెద్ద సంస్థలకు చిన్నసంస్థలపైనా అధికారం ఉండాలి, ఇతరులపై చెయ్యిచేసుకునే వరకూ పోగల వ్యక్తుల స్వేచ్ఛకు అడ్డుకట్ట వేయగలగాలి. మొత్తం సమాజంలోని వ్యక్తుల శ్రేయోభివృద్ధికి కావలసిన సేవలను వ్యక్తుల ద్వారా పొందగలిగినప్పుడే ఈ ప్రాథమిక లక్ష్యం సాధించబడుతుంది. ఈ స్థానానికి చేరిన తర్వాత సామూహిక న్యాయం అనే సమస్య ఎదురవుతుంది. వ్యక్తిగత, సామాజికతలకు సంబంధించిన విభిన్న అవసరాలు ఒక చిక్కుముడిగా తయారవు తాయి. ఒకవైపు వ్యక్తి తన యోగ్యతలు, తన యిష్టానుసారం తన వ్యక్తిత్వాన్ని పరిపూర్ణం చేసుకో

గలగాలి. వ్యక్తికి సమాజంలో స్వేచ్ఛ లభించాలన్నదే మానవ శ్రేయం కోరేది. అదేవిధంగా కుటుంబం, తెగలు, సోదర గణాలు మరియు వివిధ సమూహాలు కూడా, తమ కన్నా పెద్ద పరిధిలోపల ఈ స్వేచ్ఛతో లబ్ధిపొందాలి. తమ ఆచరణా పరిధిలో వారికి లభించడం అవసరం కూడా. కాని మరోవైపు వ్యక్తులపై కుటుంబాల అధికారం, కుటుంబాలపై తెగల అధికారం, వ్యక్తులందరిపై, చిన్నాపెద్దా సంస్థలపై రాష్ట్రం అధికారం ఉండాలి. ఎవరూ తమ హద్దు మీరి ఇతరులపై దౌర్జన్యం, బలవంతం చేయకుండా ఉండేలా మానవ శ్రేయం కోరుతోంది. మరింత ముందుకుపోయి పూర్తి మానవత కోసం కూడా ఇదే సమస్య జనిస్తుంది. దానికోసం ఏదైనా ఉన్నత శక్తిగల విధానం అంటూ ఉండటమూ అవసరమే. ఈ జాతులు, రాష్ట్రాలూ హద్దు మీరకుండా ఉండటానికి ఒకవైపు ప్రతిజాతి, ప్రతి రాష్ట్రం స్వేచ్ఛ, సాధికారం యధాతథంగా ఉండటమూ అవసరమైతే, మరోవైపు ఈ జాతులు హద్దు మీరకుండా ఉండటానికి ఉన్నత స్థాయిగల ఓ శక్తివంతమయిన వ్యవస్థ తప్పనిసరిగా ఉండాలి.

ఇప్పుడు సామూహిక న్యాయం అంటే వ్యక్తులు వర్గాలు, సోదరగణాలు, జాతులలో ప్రతి ఒక్కరికీ సముచిత స్వేచ్ఛ కూడ ఉండాలి. దాంతోపాటు హింసా దౌర్జన్యాలను నిరోధించడానికి వివిధ సామూహిక సంస్థలకు వ్యక్తులలో, ఒకరిపై మరొకరికి అధికారమూ ఉండాలి. అలాగే వివిధ వ్యక్తులద్వారా, సంఘాలతో సామూహిక శ్రేయస్సుకు అవసరమైన సేవలూ పొందే వెసులుబాటు ఉండాలి.

## పెట్టుబడిదారీ విధానం మరియు కమ్యూనిజంలోని లోపాలు

ఈ వాస్తవాన్ని బాగా గ్రహించినవాడు, ఫ్రెంచి విప్లవం ఫలితంగా ఏర్పడిన వ్యక్తి స్వేచ్ఛ, ఉదారవాదం, పెట్టుబడిదారీ విధానం మరియు

మత ప్రసక్తి లేని ప్రజాస్వామ్యాల వ్యవస్థ సామూహిక న్యాయానికి విరుద్ధం అన్న విషయాన్ని మొదటిచూపులోనే తెలుసుకుంటాడు. సరిగ్గా అదే విధంగా, అంతకన్నా ఎక్కువగా, కారల్‌మార్క్స్ మరియు ఏంగిల్స్ అనుసరణలో అవలంబించబడుతున్న కమ్యూనిజం కూడా దీనికి పూర్తిగా విరుద్ధం. మొదటి వ్యవస్థ చేసిన తప్పిదం ఏమిటంటే అది వ్యక్తికి హద్దును మించిన స్వేచ్ఛనిచ్చి కుటుంబం, వర్గం, తెగ, సమాజం జాతులపై దాష్టీకం చూపించడానికి పూర్తి రాయితీలనివ్వడం. సామూహిక శ్రేయస్సు కోసం ప్రజల సేవలను పొందేందుకు తద్వారా సమాజపు విధాన శక్తిని చాలా వరకు సడలింప చేయడం జరిగింది. ఇక రెండవ వ్యవస్థ తప్పిదం ఏమంటే, ఇది రాజ్యాన్ని హద్దుని మించి బలోపేతం చేసి వ్యక్తులు, కుటుంబాలు, వర్గాలు, సోదరగణాల స్వేచ్ఛను పూర్తిగా కబళించడం. ఇంకా ప్రజలనుండి సమాజసేవ పొందటానికి రాష్ట్రానికి అది ఇచ్చే అధికారం వల్ల వ్యక్తులు చైతన్యవంతులు అయ్యే బదులు నిస్తేజులుగా తయారవుతారు. ఈ విధానం వల్ల సామూహిక న్యాయం స్థాపించబడుతుంది అని చెప్పేవాడు వట్టి అబద్ధాలకోరే.

## కమ్యూనిజం సామూహిక దౌర్జన్యానికి అతి నికృష్టరూపం

వాస్తవానికి ఈ కమ్యూనిజం సామూహిక దౌర్జన్యం హీనాతిహీనమైన స్వరూపం. నమ్రూద్, ఫిర్ఔన్, చెంగీజ్‌ఖాన్‌ల యుగంలో కూడా ఇలాంటి పరిస్థితి ఏనాడూ ఏర్పడి ఉండలేదు. ఒక వ్యక్తి లేక కొందరు వ్యక్తులు కూర్చుని తమదంటూ ఒక సామూహిక సిద్ధాంతాన్ని తయారు చేసు కుంటారు. ఆ తర్వాత ప్రభుత్వాన్ని దౌర్జన్యంతో ఆక్రమించి, అంతులేని అధికారాలతో వ్యవహరించి ఈ సిద్ధాంతాన్ని ఒక దేశం మొత్తంలో ఉండే

కోట్లాది ప్రజలపై బలవంతంగా రుద్దేస్తారు. ప్రజల ఆస్తుల్ని జప్తుచేసి, భూములను ఆక్రమించి పరిశ్రమలను జాతీయం చేసుకుని, సమస్త దేశప్రజలు చేసే విమర్శల్ని, న్యాయం కోసం పెట్టుకునే మొరల్ని పెడచెవినపెట్టి వారికి లభించవలసిన చట్టపరమైన న్యాయమార్గాలన్నింటిని మూసివేసి దేశాన్ని ఓ బంధీఖానాగా మార్చివేస్తే బుద్ధున్న వాడు ఎవడయినా అది సామూహిక న్యాయం అని అంటాడా? దేశంలో ప్రజలు తమ గళం విప్పడానికి ఒక సంస్థగానీ, ఒక వ్యవస్థ, ఒక వేదికఅంటూ లేకుండా చేయాలి. ప్రజల అభిప్రాయ వ్యక్తీకరణకు పోలీసులు ఎవరూ లేకుండా పోవాలి. న్యాయం అర్థించడానికి ఏ న్యాయ స్థానమూ ఉండకూడదు. గూఢచార వ్యవస్థ పెద్ద ఎత్తున విస్తరింపజేసి ప్రతి మనిషీ, ప్రతివాడూ తనకు గూఢచారేయేనని భయపడేలా చెయ్యాలి. చివరికి ఒక మనిషి తన సొంత ఇంట్లోనూ నోరు విప్పాలన్నా భయపడే పరిస్థితిని కల్పించాలి. ఎందుకంటే ఎవరయినా వింటాడేమో లేక ఎవరయినా అతడి మాటలను ప్రభుత్వానికి చేరవేస్తాడేమోనన్న భయం కలగాలి. ఇంకా ప్రజాస్వామ్యం పేరుతో మోసగించడానికి బూటకపు ఎన్నికలు జరిపించాలి. అలాగే ఈ సిద్ధాంత నిర్మాతలతో విబేధించే వారు ఈ ఎన్నికలలో పాల్గొనకుండా పూర్తి ప్రయత్నం చెయ్యాలి. ఇంకా తనదంటూ ఒక అభిప్రాయం కలవాడూ, తన అంతరాత్మను అమ్ముకోని వాడు తమలో వచ్చి చేరడానికి వీల్లేదు.

మాటవరుసకు ఈ విధానం వల్ల ఆర్థిక సంపద సమానంగా పంచి పెట్టబడినప్పటికి ఆచరణలో ఈనాటి వరకూ కమ్యూనిస్టు వ్యవస్థ ఏదీ కూడా ఇలా చెయ్యలేకపోయింది - న్యాయం అంటే కేవలం ఆర్థిక సమానత్వమేనా? ఈ వ్యవస్థలోని పాలకులు, పాలితుల మధ్య సమానత్వం ఉందా, లేదా? అని నేను అడగటం లేదు. ఈ వ్యవస్థలోని నియంత మరియు అందులో వుండే ఒక రైతు జీవన ప్రమాణాలు సమానంగా

ఉన్నాయా అని కూడా నేను ప్రశ్నించడం లేదు. నేనడిగేదల్లా ఒక్కటే- వీళ్ళందరి మధ్య నిజంగానే ఆర్థిక సమానత్వం స్థాపించబడినప్పటికీ ఇది సామూహిక న్యాయం అవుతుందా? అన్నదే. నియంత మరియు అతని అనుచరులు కల్పించిన సిద్ధాంతాన్నయితే వారు పోలీసులు, సైన్యం మరియు గూఢచార యంత్రాంగం అండతో బలవంతంగా మొత్తం జాతిపై రుద్దడంలోనూ స్వేచ్ఛ కలిగి ఉండటమేనా న్యాయం అంటే? కాని, జాతిలోని ఏ వ్యక్తి అయినా అతడి సిద్ధాంతం లేక దాని విధింపులోని అతి చిన్న పాక్షిక ఆచరణకు కేవలం నోటితో ఒక్కమాట అయినా పలికే స్వేచ్ఛ లేకుండా పోతేఎలా? నియంత మరియు అతడి గుప్పెడు అనుచరులు తమ సిద్ధాంతాన్ని చలామణీ చెయ్యడానికి దేశంలోని సమస్తవనరుల్నీ ఉపయోగించడానికీ, అన్ని రకాల సంస్థల్నీ నిర్మించడాని హక్కుదారులా? కాని వారితో అభిప్రాయభేదం కలవారయినా ఓ ఇద్దరు వ్యక్తులయినా కలిసి సంస్థను ఏర్పాటు చెయ్యలేరా? ఏదయినా సమూహాన్ని సంబోధించి ప్రసంగించలేరా? ఏ ప్రెస్సులోనయినా ఒక్క మాటను కూడ ప్రచురించ లేరా? ఇది న్యాయమా? జమిందార్లు, పారిశ్రామిక వేత్తల్ని సంబంధం లేని వారిగా చేసి దేశం మొత్తంలో కేవలం ఒకే జమిందారు ఒకే పారిశ్రామిక వేత్త ఉండిపోతే దాని పేరు ప్రభుత్వమా? ఆ ప్రభుత్వం కొందరు వ్యక్తుల గుప్పెట్లో ఉండటమా? ఆ వ్యక్తులు జాతి యావత్తూ నిస్తబ్ధమయి పోయేందుకు అన్ని పన్నాగాలూ పన్ని, పాలనాధికారం వారి చేతుల్లో నుండి ఇతరుల చేతుల్లోకి పోవడం ఎంత మాత్రం సాధ్యం కాకపోవడం న్యాయమా? మనిషి అంటే కేవలం కడుపు మాత్రమే కాదు. మానవ జీవితం కేవలం ఉపాధి వరకే పరిమితం కాదు. అలాంటప్పుడు కేవలం ఆర్థిక సమానతల్నే న్యాయం అని ఎలా చెప్పగలం?

జీవిత రంగాలన్నింటిలో హింసా దౌర్జన్యాల్ని నెలకొల్పి మానవత్వపు ప్రతి దిశనూ అణచివేసి కేవలం ఆర్థిక సంపద పంపిణీలో ప్రజల్ని సమానులుగా చేసినా, నియంత మరియు అతడి అనుచరులు జీవన ప్రమాణాలు ప్రజలతో సమానంగా అయినప్పటికీ ఈ గొప్ప దమననీతి ద్వారా సమానత్వం నెలకొల్పడం సామూహిక న్యాయం అనిపించుకోదు. ఇప్పుడే మీకు నేను విన్నవించుకున్నట్లుగా, అది ఘోరమయిన సామూహిక దౌర్జన్యం. ఇది చరిత్రలోనే కనీవినీ ఎరుగనటువంటి జులుం.

## ఇస్లామీయ న్యాయం

ఇస్లాంలో ఏ వ్యక్తికైనా నా లేదా ఏ సంస్థకైనా స్వతాహాగా మానవ జీవితానికి సంబంధించిన న్యాయవ్యవస్థను తయారుచేసి లేదా దాన్ని బలవంతంగా అమలుపరిచి ప్రజల నోళ్ళు మూయించే అవకాశమే లేదు. ఈ స్థానం అబూబకర్ సిద్దీఖ్ (రజి), ఉమర్ ఫారూఖ్ (రజి)లకే కాదు స్వయానా ముహమ్మద్ (సఅసం)కు కూడా దక్కలేదు. ఇస్లాంలో నియంత అనేవానికి ఎటువంటి స్థానం లేదు. కేవలం దైవానికే ఇటువంటి అధికారం ఉంది. మానవుడు ఆయన ఆదేశాన్ని కిమ్మనకుండా పాటించాలి. ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వ సల్లం కూడ ఆయన ఆజ్ఞను శిరసావహించేవారు. ఆయన ఆదేశాన్నే పాటించేవారు, ఆయన దైవం తరఫునే ఆదేశించేవారు కాబట్టే అది విధిగా చేయబడింది. ఆయన సల్లం తన బుద్ధితో ఆలోచించి ఎటువంటి సిద్ధాంతాన్నీ ప్రతిపాదించలేదు. దైవం క్షమించుగాక! దైవప్రవక్త మరియు ఆయన ఖలీఫాల పాలనా వ్యవస్థలో కేవలం దైవ షరీఅత్ మాత్రమే విమర్శకు అతీతంగా ఉండేది. ఆ తర్వాత ప్రతి వ్యక్తికీ, ప్రతి విషయంలోనూ అన్నివేళలా నోరు విప్పే హక్కు పూర్తిగా ఉండేది.

## వ్యక్తి స్వేచ్ఛకు హద్దులు

ఇస్లాంలో వ్యక్తుల స్వేచ్ఛ ఏ హద్దుల్లో ఉండాలో ఆ హద్దుల్ని అల్లాహ్‌యే స్వయాన నిర్ణయించాడు. ఒక ముస్లిం వ్యక్తికి ఏయే పనులు హరామ్ అయినవో, వేటికయితే అతడు దూరంగా వుండాలో, అతడికి ఏయే పనులు విధిగా చేయబడ్డాయో, వేటిని అతడు నిర్వర్తించాలో,అతడికి ఇతరులపై ఉన్న హక్కులేవో, అతడిపై ఇతరులకు గల హక్కులేవో వాటన్నిటిని ఇస్లాం నిర్ణయించింది. ఏయే మార్గాలద్వారా అతడికి ఆస్తి బదలాయింపు చేయడం ధర్మసమ్మతమో, ఏయే మార్గాల ద్వారా లభించే ఆస్తి అతడికి హరామ్ అవుతుందో, వ్యక్తుల మేలుకోసం సమాజంపై ఏ విధులు మోపబడతాయో ఇంకా సమాజ శ్రేయస్సుకోసం వ్యక్తులపై, కుటుంబాలపై, సోదరవర్గాలపై యావత్ జాతిపై ఏయే నిషేధాజ్ఞలు విధించబడవచ్చునో ఏ సేవలు తప్పనిసరి చేయబడ్డాయో ఇస్లాం నిర్ణయించింది. ఈ అంశాలన్నీ దైవగ్రంథం, ప్రవక్త (సల్లం) సున్నత్‌ల శాశ్వత రాజ్యాంగంలో నిక్షిప్తమయి ఉన్నాయి. వాటిని రివ్యూ చేసేవాడు లేడు. అందులో హెచ్చుతగ్గులు చేసే హక్కు ఎవరికీ లేదు. ఈ రాజ్యాంగం ప్రకారం ఒకరి వ్యక్తిగత స్వేచ్ఛపై విధింపబడిన నిషేధాజ్ఞలను ఉల్లంఘించే హక్కు అతడికి ఎలాగూ లేదు. కాని ఆ హద్దుల లోపల అతడికిగల స్వేచ్ఛను కబళించే హక్కు కూడా ఎవరికీ లేదు. ధనసంపాదనా మార్గాలు, ధనాన్ని ఖర్చుపెట్టేందుకు హరామ్ చేయబడ్డ మార్గాల దరిదాపుల్లోకి కూడా అతడు పోలేడు. అలా చేస్తే ఇస్లామీయ చట్టం అతడ్ని శిక్షార్హునిగా భావిస్తుంది. కాని హలాల్‌గా చేయబడ్డ మార్గాల ద్వారా లభించేదేమిటో కూడా అది నిర్ణయించింది. ధర్మసమ్మతమైన యజమాని ద్వారా అతని వారసునికి షరీఅత్ చట్టాల ప్రకారం లభించే వారసత్వ సంపద, దానధర్మాలు,

సంపాదనలే విశ్వసనీయమైన ఆదాయాలు. అలాగే చట్టబద్ధుడైన యజమాని తాను షరీఅత్ పరిధిని అతిక్రమించకుండా తన సొత్తును ధారాదత్తం (హిబా) చేయడం లేదా దానంగా ఇవ్వడం కూడా విశ్వాసనీయమైనదే. అదే గనుక ఏదైనా ప్రభుత్వం తరపున ఇవ్వబడిన దానం అయితే, అది ఏదైనా నిజమయిన సేవకు బదులుగా, సమాజ శ్రేయస్సు కోసం ప్రభుత్వ ఆస్తుల నుండి సక్రమ మార్గాన ఇవ్వబడిన పక్షంలో ధర్మసమ్మతమైనదే. ఇంకా ఇటువంటి దానం చేసే హక్కుదారు షరీఅత్ రాజ్యాంగం ప్రకారం సలహా మండలి విధానంపై నడుపబడే ప్రభుత్వం అయివుండి జాతికి దానిని నిలదీసే హక్కు కూడా ఉన్నప్పుడే. ఇక సంపాదన విషయానికి వస్తే ఇస్లాంలో ఎటువంటి హరామ్ పద్ధతులద్వారా కాకుండా సంపాదించ బడిన సంపాదన ధర్మసమ్మతం. దోపిడీ దొంగతనాలు, కొలతలలో హెచ్చు తగ్గులు, నమ్మకద్రోహం, లంచం, వంచన, వ్యభిచారం, బ్లాక్ మార్కెటింగ్, అక్రమ నిల్వ, వడ్డీ, జూదం, మోసపు సంపాదించే సంపాదన, మాదక ద్రవ్యాల వ్యాపారం, పరిశ్రమ, అశ్లీల వ్యాపారం ద్వారా సంపాదన ఇస్లాంలో హరామ్. ఈ సూత్రాలను పాటిస్తూ ఏవరికైనా ఎటువంటి సంపాదన లభించినా అది అతడి ధర్మబద్ధమయిన ఆస్తి. అది ఎక్కువ అయినా, తక్కువ అయినా సరే. ఇటువంటి ఆస్తికి కనీస పరిమితిగానీ, గరిష్ట పరిమితిగానీ నిర్ణయించబడదు. అది తగ్గింది అని ఇతరుల నుండి లాక్కుని దానిని పెంచుకోవడం ధర్మమే అనడానికి; అదేవిధంగా అది పెరిగిందని దాన్ని బలవంతంగా తగ్గించడమూ ధర్మమే అనడానికి ఎటువంటి రుజువూ లేదు. అయితే ఆ సొత్తు ఈ ధర్మసమ్మత హద్దులను అతిక్రమించడం ద్వారా లభించినట్లయితే, ఇది నీకు ఎలా లభించింది? అన్న ప్రశ్నను లేవనెత్తే హక్కు ముస్లింలకు ఉంది. ఆస్తిపై అతడి హక్కులు పూర్తిగా సురక్షితం. అందులో నుండి ఖర్చు చేసే ధర్మబద్ధ విధానాల నుండి

అతడ్ని ఎవరూ దూరం చేయ్యలేరు. అదే విధంగా సమాజ శ్రేయస్సుకోసం ఏ విధులయితే వ్యక్తులపై విధింప చేయబడ్డాయో వాటిని నెరవేర్చడం తప్పనిసరి. అయితే అంతకు మించిన భారాన్ని అతడిపై బలవంతంగా ఎవరూ మోపలేరు. అతడు ఇష్టపూర్వకంగా అలా చేస్తే తప్ప. సమాజం, రాష్ట్రాల పరిస్థితి కూడా ఇదే. వ్యక్తుల నుండి తన హక్కుల్ని వసూలు చెయ్యడానికి సమాజానికి ఎన్ని అధికారాలైతే ఉన్నాయో, వ్యక్తుల ఏ హక్కులయితే సమాజంపై మోపబడ్డాయో వాటిని చెల్లించడమూ అంతే తప్పనిసరి. ఈ శాశ్వత రాజ్యాంగాన్ని ఆచరణాత్మకంగా విధింపచేసినట్లయితే ఆ తరువాత ఏ విషయమూ మిగిలి ఉండని సంపూర్ణ సామూహిక న్యాయం సుస్థాపితమవుతుంది. ఈ రాజ్యాంగం మిగిలి ఉన్నంతకాలం, అరువు తెచ్చుకున్న కమ్యూనిజమే అసలు ఇస్లామని లేదా ఇస్లామీయ సోషలిజం అని ముస్లింలను ఏ వ్యక్తీ మోసగించలేడు.

ఇస్లాం యొక్క ఈ రాజ్యాంగంలో వ్యక్తి మరియు సమాజం మధ్య ఏర్పర్చబడిన సమతౌల్యం కారణంగా ఏ వ్యక్తికీ సామాజిక ప్రయోజనానికి నష్టం చేకూర్చగల స్వేచ్ఛ లభించదు. అలాగే, వ్యక్తి నుండి అతడి వ్యక్తిత్వ వికాసానికి అవసరం అయిన స్వేచ్ఛను కబళించే అధికారం సమాజానికీ ఇవ్వబడలేదు.

## ఆస్తి బదలాయింపుకు షరతులు

ఇస్లాంలో ఒక వ్యక్తికి ఆస్తి బదలాయింపు కోసం మూడు మార్గాలు ఉన్నాయి. ఆ ఆస్తి గురించి ముందుగా చట్టపరమయిన పరిశోధన అవసరం. తర్వాత అది ధర్మసమ్మత మార్గాల ద్వారా పొందలేదని నిరూపితమయితే దాన్ని జప్తుచేసే అధికారం పూర్తిగా ఇస్లామీ ప్రభుత్వానికి ఉంటుంది.

## ధన వ్యయంపై ఆంక్షలు

ధర్మమార్గాన సంపాదించిన ధనంగానీ, ఆస్తిగానీ ఖర్చు పెట్టే విషయంలోనూ వ్యక్తికి పూర్తిగా స్వేచ్ఛ ఇవ్వబడలేదు. ఏ వ్యక్తీ తన ఆస్తి నుండి సమాజానికి హాని కలిగే విధంగా, లేక అతని ధార్మికత, నైతికతలకు నష్టం వాటిల్లే విధంగా ఖర్చు చెయ్యకుండా దానిపై చట్టపరంగా ఆంక్షలు విధించబడ్డాయి. ఇస్లాంలో ఏ వ్యక్తీ తన సంపదను అధర్మ మార్గంలో ఖర్చుబెట్టలేడు. మద్యపానం మత్తు పదార్థాల సేవనాల ద్వారం అతడి కోసం మూసివేయబడింది. వ్యభిచార ద్వారం కూడా అతని కోసం మూసివేయబడింది. అతనికి స్వేచ్ఛా జీవుల్ని నిర్బంధించి బానిసలు, బానిసరాళ్ళుగా మార్చి విక్రయించే హక్కు కూడా లేదు. తద్వారా ధనికులకు తమ ఇళ్ళను విక్రయించబడ్డ బానిసలతో నింపుకునే ఎలాంటి హక్కు కలిగి ఉండరు. దుబారా, హద్దు మీరిన సుఖభోగాలపై కూడా హద్దులను నిర్ణయిస్తుంది ఇస్లాం. సుఖభోగాలతో ఓలలాడుతూ ఉండగా తన పొరుగువారు పస్తులుండటాన్ని కూడా ధర్మసమ్మతం కాదని అంటోంది. ఇస్లాం మానవుడికి, షరీఅత్‌కు అనుగుణమైన, సక్రమమైన విధానంతోనే సంపదతో లబ్ది పొందే హక్కునిస్తోంది. ఇంకా అవసరానికి మించివున్న ధనాన్ని మరింత ధన సంపాదనకు ఎవరయినా వినియోగించ దలిస్తే అతడు ధన సంపాదనకు హలాల్ పద్ధతినే అవలంబించాలి. ధన సంపాదనకు షరీఅత్ విధించిన హద్దులను అతిక్రమించరాదు.

## సామాజిక సేవ

ఇస్లాం సామాజిక సేవ కోసం, జకాత్ పరిధికి మించి ధనం కలవారిపై జకాత్ విధిస్తుంది. అలాగే వ్యాపార వస్తువులపై, పండిన

పంటపై, జంతువులపై ఇంకా కొన్ని ఇతర వస్తువులపై కూడా ప్రత్యేక రేట్లతో జకాత్ నిర్ణయించబడింది. ప్రపంచంలోని ఏ దేశాన్నయినా సరే లెక్కవేసి మరీ చూసుకోవచ్చు. షరీఅత్ విధానంతో గనక అక్కడ సక్రమంగా జకాత్ వసూలు చేసి దానిని ఖుర్‌ఆన్ నిర్ణయించిన పద్దులలో ఖర్చు చేసినట్లయితే కొన్ని సంవత్సరాల తర్వాత అక్కడ ఒక్క మనిషి కూడా జీవితావసరాలు తీరనివాడై ఉండగలడా?

ఆ తర్వాత ఒకే వ్యక్తి వద్ద ధనసంపదలు ప్రోగైపోతే, ఇస్లాం అతడు మరణించిన వెంటనే ఈ ధన కేంద్రీకరణ ఒక శాశ్వత కేంద్రీకరణగా రూపొందబడకూడదని ఆ సంపదను వారసత్వం క్రింద విభజిస్తుంది.

## దౌర్జన్య నిర్మూలన

అంతేకాక భూయజమాని మరియు కౌలుదారు; కార్ఖానా యజమానీ, కార్మికుడు పరస్పరం అంగీకారంతో ఇద్దరి మధ్య సక్రమ పద్ధతిలో వ్యవహారాలు చక్కబడటం, చట్టం జోక్యం అవసరం లేకపోవడాన్ని ఇస్లాం పసందు చేసినప్పటికీ, ఈ వ్యవహారాలలో ఎక్కడయినా జులుం జరుగుతూ ఉంటే ఇస్లామీయ ప్రభుత్వం అందులో జోక్యం చేసుకునే పూర్తి హక్కును కలిగి ఉంటుంది. చట్టం ద్వారా న్యాయానికి హద్దుల్ని నిర్దేశిస్తుంది.

## ప్రజా ప్రయోజనాల కోసం జాతీయ సంపద యాజమాన్యపు పరిమితులు

ఏదయినా పరిశ్రమ గానీ, వ్యాపారంగానీ ప్రభుత్వం తన ఏర్పాట్ల ద్వారా నడిపించడాన్ని ఇస్లాం హరాం చెయ్యదు. ఏదయినా పరిశ్రమ లేక వాణిజ్యం సామూహిక ప్రయోజనాల కోసం అవసరం అయివుండి, వ్యక్తులు

దానిని నడిపించేందుకు సిద్ధపడక పోయినట్లయితే లేక వ్యక్తుల అజమాయిషీలో అవి నడుపబడటం, సామూహిక ప్రయోజనాలకు నష్టం కలిగించే విధంగా నిర్వహింపబడుతున్నట్లయితే, ప్రభుత్వం ఆ వ్యక్తులకు పరిహారం ఇచ్చి ఆ వ్యాపార వ్యవహారాల్ని తన చేతుల్లోకి తీసుకోగలదు. మరో సముచిత రీతిలో దానిని నడిపేందుకు ఏర్పాటు చేయవచ్చు. ఈ విధానాలను అవలంబించడంలో షరీఅత్ పరమయిన అడ్డంకి ఏదీ లేదు. తద్వారా సంపద రాబడికి సంబంధించిన మార్గాలన్నీ ప్రభుత్వ ఆస్తిలో చేరి ఉండటాన్ని, ప్రభుత్వమే దేశం యొక్క పరిశ్రమలకు వాణిజ్య రంగానికీ ఏకైక యజమానిగా ఉండటాన్ని ఇస్లామ్ సైద్ధాంతికంగా అంగీకరించదు.

## బైతుల్‌మాల్ (ఇస్లామీయ ధనాగారం) వ్యయానికి షరతులు

బైతుల్‌మాల్ విషయంలో అది అల్లాహ్ మరియు ముస్లింలకు చెందిన ఆస్తి అన్నది తిరుగులేని నిర్ణయం. దాన్ని యజమానిగా ఖర్చుచేసే హక్కు ఏ వ్యక్తికీ లేదు. ముస్లింల వ్యవహారాలన్నింటిలానే బైతుల్‌మాల్ ఏర్పాటు కూడా జాతి లేక దాని స్వతంత్రులయిన ప్రతినిధుల సలహాతోనే జరగాలి. ఏ వ్యక్తినుండయినా, ఏది తీసుకోబడినా, ఏ పద్దులో ధనవ్యయం చేయబడినా అది ధర్మబద్ధంగా షరీఅత్ విధానం ప్రకారం జరగాలి. ముస్లింలకు దానిపై ప్రశ్నించే లేక లెక్క అడిగే పూర్తి హక్కు ఉంటుంది.

## ఒక ప్రశ్న

ఈ టాపిక్‌ను ముగిస్తూ, సామూహిక న్యాయం అంటే ఆర్థిక న్యాయమే అయితే, ఇస్లాం స్థాపించే ఆర్థిక న్యాయం మనకు చాలదా? అని ఆలోచించే ప్రతి ఒక్కరినీ ప్రశ్నిస్తున్నాను. అలా అయితే వ్యక్తులందరి స్వేచ్ఛనూ లాక్కోవడం, ప్రజల ఆస్తుల్ని జప్తు చేయడం యావత్ జాతినీ

కొందరు వ్యక్తుల బానిసలుగా చెయ్యడమే తప్పనిసరి అయ్యే అవసరం ఏదయినా మిగిలి ఉంటుందా? ముస్లింలమైన మనం, మన దేశాలలో ఇస్లామీ రాజ్యాంగం ప్రకారం ప్రత్యేకమైన ఇస్లామీ ప్రభుత్వాలను స్థాపించుకుని, అందులో పూర్తిగా దైవ షరీఅత్‌ను ఎటువంటి హెచ్చుతగ్గులు లేకుండా విధింపచేసే విషయంలో మనల్ని ఆపేది ఎవరు? మనం అలా చేస్తామో, చేసిననాడు కమ్యూనిజం నుండి దేనినీ కాపీ కొట్టవలసిన అవసరం ఏదీ మిగిలి ఉండదు. పైగా కమ్యూనిజం బారినపడిన దేశాల ప్రజలు మన జీవన వ్యవస్థను చూసి, ఏ వెలుగునయితే కోల్పోయి తాము చీకటిలో తారట్లాడుతున్నారో అది వారిముందు తేజోమానంగా ప్రకాశిస్తుండడాన్ని గమనిస్తారు.

✪ ✪ ✪